యెందుకో చలమిట్టు చూపు • తెలుఁగ రాదు
ఘోరితరవిక్రమధురీణ • పుష్పబాణ. 10

(అనియనేకవిధంబుల బ్రార్థించిన నంతకంతకు వెఱపించుచు పంచవిధశరంబు లాడలనించుచున్న కీరవాణిం జేరంజని దైన్యరసంబుతో)

హిందుస్థాని—జావ్ళితాళము.

ఇకెంత సేపునే భరింతునే సఖీమణీ।
యకారణంబుగా నలంచె నయ్యొ సఖీమణీ॥ యికెం॥
సుమాస్త్రుఁ డాళి మేను నిండె చూడవే చెలి।
యమానుషంబు సేయఁబూనె నక్కటో చెలి॥ యికెం॥
సుమంతమైన ధైర్య మెదను సోకదే చెలి।
సుమంబు వంటి మేను కాక స్రుక్కెనే చెలి॥ యికెం॥
ధరనొప్పు శ్రీచోళ్లేరునగర ధాముఁడై కృప।
వరలక్ష్మినారసింహరాయ వరదుఁ డేలఁడే॥ యికెం॥

(ఇట్లు బల్కి తనలో) శాఠ్ఠి వేయివిధంబులని పెద్దలనెడిమాట లబద్ధమా యీకొంచెపువానిని మంచిమాటలతో వేఁడిన మేలు సేయునా సేయఁడుగాన వీనిమానంబుమాలి నేలపాలగునట్లు గట్టి తిట్లు తిట్టి యేమట్టువెట్టెద కానిమ్ము. (అని రోషావేశ ముఖారవిందయై)

మ-శా. నీకోదండము వాడ నీదుశరము • ల్నీరంబులోఁగూడనీ
బాకాచెట్లను జిక్కనాకి వెతలై • పద్మంబులందక్కనీ
మూకల్గ్రండలనుండ నీరదము పా • ముల్నోటిలో నిండనీ
శోకాశంభుఁడు చూడ నేను మదిలో • సుంతైన నిన్వేడఁరా.

ఉ. నీకును నీదుమామబలెనీతి యొకింతయునైనలేక పె 11
న్వ్రాకలపెట్టుచుండెద వకారణవైరముచే వియోగుల
న్డీకొనలేవు యోగులకడిండిమగంటిమిగల్గువాడవే
ఛీ! కమలాస్త్ర శంకరునికే చెడెనన్న మది సిగ్గులేదుగా. 12

(అని సరోరుహాస్త్రుని తిరస్కరించి తదీయ చతురంగంబుల జూచి కోపముతో)

సీ. కీరమా నీకింత♦బీరమా హాహాంత
నరువసాంకవగంధి♦నాటవినవె
వాతమా సంజాత♦శీతమా ఇదిరోత
యనవు శేషఫణివేణి♦ననుచు కనవె
పైకమా నీవింక♦ధాకమా సవుజింక
మిడనీలవాలనా♦చెఱుగవేమొ
భసలమా నీవిట్లు♦మెసలమార్గమ దెట్లు
హేమనాసనటంచు♦నెంచిమనవె.

గీ. యెదిరిబలముల నెఱుగక♦నెవ్వరేని
కదిసిపోట్లాడ పరిభవం♦బొదవకున్నె
యందుకేకద మీదార♦హరునిదాకి
భస్మమైకూలడే మున్ను♦పంతమేది. 15

(అని శుకపికముల యసమీర బంభరంబుల నదలించి చెలికత్తెలఁజూచి) సఖీమణులారా! యెన్నిజెట్టినా అన్నియు స్మరచి కుసుమాస్త్రుం డసమాన విక్రమంబున పువ్వుటంపరచే నొడలెల్ల, చుఱుకు, చుఱుక్కుమనుపించె. కలకలమని చిలుక లులికిపడ బలికె నాతతభీతినసువారితంబులు చీకాకుపడ కోకిలమూకలు కోకోయనికూసె. ఇమ్ముగా తలదిమ్మ గ్రమ్మ తమ్మితేనియ లిమ్ముగాగ్రోలి తుమ్మెద మొత్తములు ఝుమ్ఝుమ్మన గానమ్ములు చేసె. మేనువడంకె. నేనింక సైపజాల (నని నెమ్మేనుమఱచి మూర్ఛిల్లిన చెలికత్తెలు వెల్లనైన మోములతో) తల్లి! మాయుల్లంబులెల్ల ఝల్లుఝల్లన మమ్మిక్కడడించి నీవెక్కత్తై వెక్కడికిపోవుచున్నదాన వికజవ్వని మాకెవ్వరుదిక్కు (అనునెడ కీరవాణి ధాతుస్థానంబుల పరిశీలంబుచూచి)

కీ—మదనమాలా.

మ—ఏమమ్మ కీరవాణీ.

కీ—ఇదిగో దీని చేయి చూడుము.

మ—చూచితిని.

కీ—క. ఇదిమూర్ఛగాని వేరొక
విధమేమియు లేదు చూడ • విధుబింబముఖీ,

మ—క. అదియే నేననుకొంటిని
సుదతీ యేమిడి నకనులఁ • జూచునె మనలన్. 14

కీ—సుందరీ తొందరించిన కార్యంబవ్వునా నేనందుకే కదా యోచించుటలు.

మ—అక్కా నీవన్నియు దెలిసినదానవు, నీవే చక్కఁనపోయెదవ్రా నాకు నా చక్కియే ముఖ్యము.

సీ. పడతిరో చల్లని • పన్నీరు చిల్కనా?
కీ—యదికను దమ్ముల • కంటవలదు.
మ—కమలాక్షిరో చంద్ర • ఖండంబు రాతునా?
కీ—స్తనచక్రములకడ • దలచవలదు.
మ—కలికిరో చిగురుటా • కులగుత్తులిడుదునా?
కీ—తనుభర్త్రమునకవి • తగులవలదు.
మ—వెలదిరో నేమంచి • వీవనవేతునా?
కీ—ప్రాణపుష్టముకడ • పట్టవలదు.
మ—గీ. చారుతరశైత్యచందన • సారికోరి
తెచ్చితిని చల్లవచ్చునె • మచ్చకంటి
కీ—మదనతాపంబు చేగ్రాగి • హృదయకలశ
పూరితస్నేహరసమది • పారలవలదు. 15

(అనెడు పలుకులకు మదనమాల మదికుదరక)

మ—కం. ఏపని సేయగబోయిన
నాపనివలదందువెప్పు • డదియేమిటికో.

కీ—కం. ఓపడతికోపమటవే
యాపనులాస్థానములను • నహాఁములటవే. 16

మ—అక్కా కీరవాణీ! ఈచక్కెరబొమ్మ వాల్చినపక్క కదల్చకున్నది. కాలాతీతంబైన నేమి హాని సంక్రమించునో గాన తొందరగా శైత్యోపచారంబు లొనర్పుటయే మంచిది. (అని కీరవాణిఁ జూచి)

సీ. ఇంతియీచిగురాకు◆ లేమిసేయుదమమ్మ?
కీ—ఈవిపాదములకం◆టించవమ్మ.
మ—అరటులపొరలున్న◆వవి యేమిపనికమ్మ?
కీ—పొలతియూరువులకు◆ పొదువవమ్మ.
మ—తోరమామాయులరుగు◆త్తులనెందుకోనమ్మ?
కీ—చెలిగుబ్బచనులపై◆ చేర్చవమ్మ.
మ—కలువరేకులు చాల◆ చెలులు దెచ్చిరిసుమ్మ?
కీ—కలికికన్నులమీఁద◆ కప్పవమ్మ.
మ—గీ. మొలకపాల మిదెందుకో◆ తెలియుదమ్మ?
కీ—ముగుదకుంతలములనుండి◆ ముడువవమ్మ.
మ—చెలఁగి కొండమ్మ లేపని◆ సేయునమ్మ?
కీ—గోతిచేదోయికిని గీలు◆కొల్పవమ్మ. 17

మదనమాలా! చూచితివా యీవస్తువు లీస్థలంబులకనుకూలంబులై శైత్యోపచారంబులచే నొక్క యరక్షణంబునకు తెలివి నొంది ప్రకాశింపఁగలదు. చూచుచుండుఁడీ. (అనునంతలో మునుంగిడిన పట్టుశాలువ సడల్చి దిగ్గున లేచి, కీరవాణీ మదనమాలలం జూచి)

మి—తోఁబుట్టువులారా! మీ మోముదమ్ము లెందుకో చిన్నబోయియున్నవి చెప్పుఁడు. (అనినవారలు చెక్కిళ్ళు దువ్వుకొని చెక్కులు ముద్దుపెట్టుకొని గంభీరభాషణంబులతో)

తే—గీ. ఏమిచెప్పుదుమమ్మ నీ◆విపుడు మూర్ఛ
జెందినందున భయమంది◆ చేయువిధము
లెల్ల చేసిన తెలివొంది◆తిపుడు మధుర
మృదులవాగ్వృంద ధృతకుంద◆ మిత్రవింద. 18

(అనిన వచ్చియు రాని నవ్వునవ్వి పునర్మోహావేశం బగుటయు చెలికత్తెలఁ గనుంగొని)

తోడిరాగము—ఆదితాళము.

ప—రాఁడేమాయలకాఁడే-యీఁడుజోడని నమ్మియుంటిని
నన్ను వీడనివాఁడనుకొంటిని। యేఁడే వాఁడయొ రాచపాడి మాని
యెందు॥ రాఁడే॥

ఘనుఁడాతఁడవి వలకోటగా। యల్ల! మునిమాటలవినీళ్ళమూటగా।
మది। ననుకున్న ముచ్చటలవి దూరమైపోయె॥ రాఁడే॥

మారుఁడెక్కు—వశత్రువుఁడాయెను। కంటికీరీతినిదూర్కు—లేదాయెను
కీరవాణియింక యేరీతిభరియింతు రా॥

వరకీర్తిజితహీరకాశుఁడైచెల్లే। ధృతిదివ్యసాధనివేశుఁడై
ధరతాఁడేపలిలక్ష్మీనరసింహారాయేడ్వఁడు రా॥

(ఇవ్విధంబున నలంగుచున్న యామంగళాంగిం గని తేనెలొలుకుపలుకులతో.)

చె—కం. కోమ్మా నామనవిని గై
కోమ్మా నీవింత మరులుకొనతగదమ్మా
రమ్మా వనరాజివినిక
రమ్మారయసుగుణసదనకరాజితవదనా. 19

చం. అచటికిపోయిచూడదగికనట్టివినన్నియుద్యానవచ్చట
నిచికలపుష్పసంపదలకువేడుకలెల్లనుగన్న నెమ్మది
నచ్చిగనుపించుపిమ్మటసరోరుహలోచనయిల్లుజేరిన
న్బ్రచురతనన్నికార్యములకుభంగురరీతిజెలంగుతప్పకన్॥ 20

(అనిన సంతోష మొందక డోలాయమానమానసయై)

సి—క. మాటలాకకోటిచెప్పిన
పాటకచేలుండువచ్చికపానుదలిర్ప
న్నాటములదేల్చకుండిన
బోటిరొ సంతోషమెట్లుకపుట్టును చెపుమా. 21

అయ్యో నమీఇష్టాను సారంబువచ్చెఁడనదియు తీరును. నారదునిమా టలకన్న నీతోఁటయెక్కువయే! మీపకోపంబురానేల లెండు. (అని అం దరు పరిక్రమింతురు.)

(రంగము. శృంగారవనంబు.)

మిత్రవింద చెలికత్తెలతోఁ బ్రవేశించి యచ్చటివింతలు కన్నులకొలఁ దిఁజూచుచు చెలులంగనుంగొని)

ఫీలు రాగము-ఏక తాళము.

వనమెంతో శృంగారమె బాలా!
వినమిట్టిదని గట్టిగను నెవ్వరస్సరైరిమున్ను॥ వన॥
అలమల్లెపువ్వగలతావు-తిలమించెగలిగించె!
వలనొప్పబలుకూరిమెదప॥ వన॥
చామంతివిడలేమొపాలుపొంది-నామీఁదనామోద!
మీమాడ్కిఁప్రేమంబుజూపె॥ వన॥
ధరచొల్లేరుపురమునమండి-వరతాడేపలి లక్ష్మి!
నరసింహారాయడ్యడేలు॥ వన॥

సీ. తనముక్కురంగుసౌ◆యమ్మసబూనెననికదా
చిలుకదాడిమపండ్లు◆చించుఁబెల్ల
తనపల్కునీడయం◆దునిచెనేడనికదా
యామ్రమంబుననుపికం◆బఱచుబెల్ల
తమకుంభములదాక◆తలచినవనికదా
వెలగపండ్లకుకరు◆ల్వేచుఁబెల్ల
తనసైత్యమొగిగర్భ◆మునఁదాల్చెననికదా
వలిగాడుపరటుల◆గలచుఁబెల్ల.

గీ. తమతను ప్రభలాగితరం◆గములనుంచె
ననిగదా వానిహరియించ◆హంసలెల్ల
నీకొలంకులలోనుండు◆బెల్లచూడ
చిత్రమయ్యెనుపూఁదోట◆చెల్వమెల్ల. 22

(అని కీరవాణి కై దండకొని)

ఆహా మంగళాంగి మనకుటంగట చెలంగు సరోవరస్థిత మంజుతర కంజాతపుంజ సంజాత, మకరంద, బిందు సందోహపాన మద బంభర డింభ శుంభ త్సంగీత మాధురీ శ్రవణాసక్తచిత్త సమాగతైణ కిశోరంబులును తద్వైణకిశోర విశాల చంచలదృగంచల సంభూత హాశ్చర్య రసమహార్ణవ తరంగిత రంగిత కరుణాప్లవస్థిత వనదేవతా వితానంబును, తద్వనదేవతా కనత్కనక కుంభ సదృశ మాంసల స్తనయుగ్మలావణ్య వీక్షణమాత్ర వ్రీడీకృత కరిణీనికరంబును, తత్కరిణీనికర సముద్యత్కర కంపితరసాల రసారుహంబులును, తద్రసాలరసారుహ పతితమహా రుచికరఫలవితానభుజ్యమానసంతోషిత వనసంచార శబరవనితా సందోహంబై వెలుంగు నీయారామంబు నందనంబును గేణిసేయుటకు సందియంబే సంతోషించితి. (అనిన కీరవాణి సంతోషంబున)

కీ—కం. మెచ్చితిపీవనరాజం
బచ్చుగదోహదముసల్ప♦వైతివికొమ్మా
మి—కం. మచ్చికతోనదిదెల్పిన
మెచ్చుచుసల్పెదనుమనకు♦మేలుగదమ్మా. 28

(అనిన ప్రతివృక్షంబును జూపించుచు)

కీ—సీ. ఇదియశోకముదీని♦పదతాడనముసేయు
మిదివకుళంబుమే♦లొదవనుమియు
మిదికురువకమునీ♦వెనసికౌఁగిలిగొను
మిదితిలకంబిందు♦వదనచూడు
మిదియెమాకందమి♦య్యెడకరంబునముట్టు
మిదికర్ణికారమిం♦పెనయఁజేయు
మిదియెవావిల ముఖా♦హ్వానవాయువుఁగవ్వు
మిదియె నమేరు మో♦మెత్తినవ్వు

గీ. మిది యొసంపెంగ ముఖరాగ - మెలమినీయ
మిదె ప్రియాళువు సంగీత ◆ మిచ్చెఁ బాడు
మీవిధంబునఁ బుష్పించు ◆ నీకుజంబు
లట్లుగాకున్నఁ బుష్పించ ◆ వదినిజంబు. 24

(అనిపలుకు చెలిపలుకులకు మొలకనవ్వు లొలుక)

మి—కప్పురగంధి! నీచెప్పినచొప్పున చేసితివి. నీవన్నమాట లన్నియు వన్నెబెట్టినట్లు జరుగుచున్నయవి నావెంట నంటిరమ్ము. నెచ్చెలీ! యిచ్చట విచ్చలవిడిపూసిన పచ్చపువ్వుల గోరంటు దంట కొల్లగా నల్లుకొని తరణి కిరణంబుల జొరనీక చల్లగాడ్పుల కిరవై యుల్లసిల్లు యీమల్లెపొదలలో నుల్లంబులు రంజిల్ల సల్లాపంబులాడుచు కంటికింపైన నీటుకాంద్రతో బోటులు వాటంబుగా కూటంబులో నచ్చట కావో యెంతవీలుగా నున్నదో కన్నులారజూచితివా? యిది యట్లుండనిమ్ము. మనకు అంగటజెలంగు సంపెంగలసొంపు కంటికింపుగా కంటివా ఘుమఘుమమను వాసనలెల్లదిక్కుల నల్లుకొని బంగరు రంగును తురంగలించగల సోయగంబుచే నివ్వాటిల్లు పుష్పములు కొల్లగా శోభిల్లుచున్నయవి. ఇట్టి పసగల కుసుమంబుల దంట కొక్కతుమ్మెదయైన మతిమఱచియైనం జేరదు కదా. నిండుజవ్వనంబున గండుమీలు నాయండకా పుండరీకాక్షుండరుదెంచని చందం బందు గన్పించుచున్నయది. అక్కా నా కొక్కరుతోడై రికబా. ఇదిపోనిమ్ము. ఈపన్నీరుకాలువ దాటిపోదమురమ్ము. తొయ్యలీ! యీతియ్యమామిడిచెట్టుకొమ్మలసందున పసందుగానుండి మెండుగాపండిన పండులను తనచంచుపుటంబుతో చించిరసవిసరంబు పసమీరచావి తనచెంతనున్న కాంతకందించుచున్న యీశుకరాజంబును చక్కగాజూచితివే! యేమిహాయైశ్వర్యము! యెక్కడచూచినా స్త్రీపురుషుల కన్యోన్యదాంపత్యంబుసే కన్పించుచున్నయవి యిదిచాలించుము. చల్లని నీరంబులు వెల్లువలై పారుచున్న నాసరసిచెంత నొక్కవింతగన్పించుచున్నయది. చె

చ్చెరపోదమురమ్మ. చూడు-చూడు. చేమంతి పూబంతులు రెండుచేతికిచ్చి హెచ్చిన మచ్చికతో నొక్కఁజెంచుకోడెకాఁడొక్కఁ చక్కఁరబొమ్మనుగట్టిగాఁబట్టుకొని నీచెక్కుటద్దంబులొక్కఁసారి నొక్కఁనిమ్మని మ్రొక్కిన నాటక్కులాడిగిరక్కున మరలిపోవుచున్నయది. అది రతిపరిశ్రమ మెఱుగనికన్నియవలె దోఁచుచున్నయది. కాకపోయిన యాకలికికంటికింపుగన్పింపకున్న వాఁడేమో? లేక మనయిద్దఱినిచూచినయీముద్దియసిగ్గుచేఁబోవుచున్నదియో. బోటీ మనకేమైన పాపంబు ప్రాపించునా (అనినఁ గీరవాణినవ్వుకొనుచు)

కీర——బాలా! నీవెంతబేలవే యూహాలుగంటివేమైనమన మొద్దనిగద్దరించితిమాయేమి. నీవిచ్చముచ్చటలిక చాలించుము (అనిపశ్చిమదిక్కుమొగంబై)

మి——కలకంఠకంఠీ! మనమనేక మధురరసభరితంబులగు ఫలంబు లనుభవించితిమి. సుధామధురంబైన చల్లనినీరంబులు గ్రోలితిమి. ఈయారామంబునన్గలచిత్రంబులెల్ల కన్నులకింపుగా చూచితి మిఁకకొంత సేపు ఒక్కఁ జాలరసాలభూజంబుక్రింద నెలరాతితిన్నెయందు కూరుచుని పరిశ్రాంతిజెందుదమా తల్లీ. (అందరుపరిక్రమింతురు.)

(రంగము-వనములోనున్న మేడ. సఖీపరివృతయైనమిత్రవింద ప్రవేశించుచున్నది.)

మి——మదనమాలా! కాంచితివా.

గీ.-భానుఁడఱుదెంచునని ప్రేమఁబూని వేడ్క
పశ్చిమాశాసతీమణిఁ బరగనెఱ్ఱ
పట్టుచీరను దాల్చినపగిదిఁజూడ 25
సంజకెంజాయ దోఁచెనుఁ ఛాయగతిని.

క. ఆచీరవనికిరాదని
దాఁచివెసన్నల్లు లోకఁదాల్చినగతిమూ
డాచానకటికిచీకటు
లీచతురాశల మెలంగెఁ హెచ్చుగఁ బైపై. 26

క. నిక్కముగ గగనచారులు
చక్కగదీపంబులిడినచందంబున నే
డక్కాచూడవెమింటను
జుక్కలుకన్పట్టిచూడజూడఁగనింపై. 27

చంద్రోదయవర్ణన.

సీ. హరికిమ్రొక్కెడిశచీతరుణివెల్గించిన
దీపించుకర్పూరదీపమేమొ
పూనిజయంతుఁడొప్పుగభార్యవెసచూడ
మొనసిచూపించెడిముకురమేమొ
తమ్ముఁడుచూడకందర్పుఁడొయ్యనగట్టి
పంపినముత్యాలబంతియేమొ
యమరులు తమజయంబమరఁదెల్పఁగవేడ్కఁ
గట్టించినట్టి జేగంటయేమొ
గీ. సారవల్లభకంఠస్థహారమందు
బరగుచున్నట్టివజ్రాలపతకమేమొ
వైజయంతమునందు దుర్వారగతిని
నలరుగోమేధికపు గడియారమేమొ. 28

(అని కొంతసేపు వితర్కించి గట్టిగా)

సీ. కర్పూరదీపంబుగాదివెలుంగుపై
వెలయుజక్కవకవవిప్పఁజొచ్చె
వరపుగాముత్యాలబంతిగాదిప్రభ
పొడగన్నవెన్నెలపులుగులెచ్చె
ఖచరులమేటిజేగంటగాదికాంతి
చూచినపద్మములొల్లంపునిచ్చె
క్రమదర్పణఫలకంబుగాదిరుచి
గాంచినకల్వలగములుమెచ్చె.

గీ. సన్నసన్నని వెన్నెల లల్లనాగెనమ్మ
చూడచూడగ వలిగాడ్పు సోకెనమ్మ
మగుడ చుక్కలు పైపైన మాసెనమ్మ
పేర్మిగనవమ్మ యిదిచంద్ర బింబమమ్మ. 29

(అని తచ్చంద్రాగమంబున కానందభరితాంతఃకరణయై కొంత సేపూరకుండి)

ఓ మదనమాలా! ఓకీరవాణీ! గండుమీరెడి యీపండువెన్నెల జగదండంబు నిండికొని కాంతిమంతంబై యున్నదను సంతోషంబు నామంతనంబున కింతయైన లేదుగదా! మీకందరి కెట్లు లున్నదియో యెండకాలంబున పండునిప్పుల దండగూరుచుండ నెట్లుండునో యీ చంద్రుని చంద్రికాహారంబు నామేనికంత యుష్ణంబు చేయు చున్న యది. నాకీబాధసోకకుండ నీకల్వల జేదును వేడుకొనుచున్నదాన.
(అని ప్రకాశముగా)

క. చల్లని రేడవు నీదగు
చెల్లెలు కల్కలనొసంగు క్షితినందరికి
న్గొల్లగ నీబావయు పెను
బల్లిదుడు భవద్గురుండు పాల్కడలిగదే. 30

ఇట్టి నీవు నాయట్టిపట్టిని రట్టుపెట్టనాయమా (అని వేడుకొని ననంతకంతకు కిరణప్రసారంబెక్కుడైన తీవ్రకోపానలంబు దరికొల్పుచు,) శీతకరణా! యిక నీగర్వభంగంబగునట్టుగట్టి తిట్టుల తిట్టెద చూడరా (అని బిగ్గరగా)

సీ. పగలెల్లదాగి దొంగగతి జేదిరుగాడు
ముచ్చ నీయెదపైన మచ్చపుట్ట
సొంపుగా మిత్రుని చూడలేక నలంగు
దైన్యాత్మ నీకళల్ దరగిపోను
చదువు చెప్పినవాని ముదితను చేకొన్న
పావిలేనట్టి నిన్నాపము బట్ట

మొదటిచెల్లెలిశాపముఁ దలఁపఁ జేసిన
ఖలనీచపాండురోగంబుపుట్ట
గీ. పుట్టినింటనిబొంగించి పారలసేయు
కష్టజాతివినీచగిరికాఁపుచూండ
వెసవియోగులపై బండ వేయుచుండ
కందదాయనునీకండకిందురుండ. 31
క. తరుణులబాధింతురయా
పురుషులకై సిగ్గులేకఁ బాల్పగనీవా
మరుడాయమృతుంలరై
వారిహారిపాపులకునాయువధికముగాదే.
ఉ. మునుపలదక్షయాగమునఁ బుఖ్యాతదక్షునిపక్షమైమదం 32
బునవడెవీరభద్రునితోఁ బోరినసిన్నెఁ గివామపాదఘు
ట్టనసలయించెనప్పుడుతటాలునబారితివారమాద్రుశాం
గనలగలంచకోరిచెడుఁ గాయిదిబంటుతనంబెరాజుసుకా. 33

(అనియనేక విధంబుల దూరిచెలులగనుంగొని) ఇక్కరాతుం దుక్కుమిగిలి తిట్టినమొండివడి పందువెన్నెలల నలయించుచున్న వాడిక నేనోర్వజాల. (అని మూర్ఛమునింగిన కీరవాణిమదనమాలంజూచి.)

కీ—క. వనజాస్త్రునిబారికిజ
వ్వనిగుందినగాదెమనమునవనముకురాక
ల్వనజాక్షినిచటనటువలె
వనజారినలంచసాగ్యవనమేలయికన్. 34

(అనినమదనమాలయోచించి)

మ—అక్కా ఈచక్కరబొమ్మను శీతోపచారంబుల మూర్ఛదేర్చి యింటికిచేర్చి యీమచ్చటలా మచ్చెకంటితల్లికి నన్నలకు దెల్పి శీఘ్రకాలంబులో స్వయంవరంబు జరుగునట్లు సేయుట యుచితమైనట్లు నాకు తోఁచుచున్నయది. నీచిత్తం బెట్లున్నదో యోచిం

చుము. లేనిచో నీతోయజానన కాయజ తోయజారులబారులచే డస్సినపిదప మనమేమి సేయఁగలవారము. (అనిన)

కేర—మదనమాలా ! నీయోచనయోచింపతగినదే.

(అనిమూర్ఛదేర్చి, అందరు నిష్క్రమింతురు.)

తృతీయాంకము సంపూర్ణము.



శ్రీచెన్నకేశవసహాయము.

# మిత్రవిందాపరిణయనాటకము.

## చతుర్థాంకము

(రంగము-విందుఁడు-అనువిందుఁడు-మంత్రి.)



న ర్మసచివ! ఇటురమ్ము.

మం—రాజకుమారా ! వచ్చియున్నవాఁడ సెలవేమి.

విం—క. మామిత్రవిందకాశ్రిత

రామకువరుసస్వయంవరముసేయుమటం

చామంనిపతి సెప్పినమన

మేమియొనర్చకనునుంటిమిందాకనొగిన్.

కావున మంచిముహూర్తంబు విచారించి చెప్పుటకు మనపురోహితశిఖామణియైన గర్గమహామునిని రావింపుమా.

మం—చిత్తమాలాగే పిలిపించుచున్నవాఁడ. (అంత గర్గుండరుదెంచి ద్వారపాలకున్జూచి)

గర్గు—ఒరీ! నీవెవ్వండవురా నేను వచ్చియున్నానని మీరాజుగారితో చెప్పుమురా ?

(అనిన వాఁడులోపలికిపోయి)

ద్వా—ఓరి! నీవెవ్వఁడవురా నేను వచ్చియున్నానని మీరాజుగారితో చెప్పుమురా ?(అనినరాజునవ్వుచు)

విం—ఛీ! ఛీ! పిచ్చివిధవా ! వచ్చియురానిమాటలు మాట్లాడకుపో.

(అంతవాఁడరుదెంచి గర్గునిజూచి.)

ద్వా—ఛీ! ఛీ! పిచ్చివిధవా ! వచ్చిరాని మాటలు మాట్లాడకు పో. అని అన్నాడయ్యా స్వామి!

(అనిన వానిఁజూచి)

గ—అప్లాగాదురా శంంతా! ఆయన వచ్చియున్నాడని అనరా.

[అనిన ద్వారపాలకుడిట్లనగా రాజు కోపోద్దీపితమానసుండై.]

విం—ఛా! దుష్టమానసా! చెంపలు వేయించెద వెళ్ళిపో. మళ్ళావచ్చితి వేని నీమచ్చమాపెద (అనిన వాడువచ్చి అదియేఅనును)

గ—ఈమాటువెళ్లి మీపురోహితుండగు గర్గుండు వచ్చినాడనిచెప్పుమురా (అనినచని వాడట్లుచెప్పును)

విం—శీఘ్రముగారమ్మనుమని చెప్పుమురా (ప్రవేశించును)

విప్రవర్యా పదివేలవందనంబులు కల్యాణు, కల్యాణు. ఈమణిసింహాసనమందధిష్టించుడి (కూర్చుండిపిమ్మట)

గ—రాజన్యశేఖరా! మీరునన్ను రావించిన కారణంబేమో సెలవివ్వుడు (అనినహాసన్ముఖుండై)

విం—గీ. పొందుమీరగ మామిత్రకవిందకిపుడు
పరిణయమొనర్పఁగనుస్వయంవరము సేయ
బూనినారము శుభకరంబైన యొక్క
లగ్నముసుచూచిచెప్పుమీశలలితచరిత. 2

(అనినవాబ్రాహ్మణుండు హాస్యరసంబు చూపించదలంచి)

గ—రాజా మేముక్రొత్తగా శుద్ధలించిన పంచాంగశ్రవణ శ్లోకంబునావధాన చిత్తుడవై వినుము, (అని పంచాంగము చేత పుచ్చుకొని బిగ్గరగా)

శ్లో॥ శ్రీకల్యాణగుణావహం రిపుహతం దుస్వప్న దోషాధికం।
గంగాస్నానవిశేష పుణ్యాహననం గోదానఫలంగం నృణాం।
ఆయుర్భంగమముత్తమం సుచిహతం సంతాన సంపర్ధరం।
నానారుగ్మతసాధనం సముచితం పంచాంగ మాకర్ణ్యతాం॥

అద్యరాత్రి తిథిశ్రుణుత రంగసాని......... గడబడ నామ సంవత్సర దాలితలమాసంబున నింద్రియపక్షంబున నేడు ద్వాదశాంగుళి ...... వారం కంఠాభరణ నక్షత్రం దుర్మదయోగం బాలకరణం. ఈరోజున పన్నెండుగడియలరాత్రికి ............ ఛార్జం తెల్లగా వెళ్ళిపోచుంది మహాప్రభో! (అనిన రాజు ముసిముసి నగవులునగవుచు)

విం—గురుశిఖామణి! మీరిక హాస్యరసంబుమాని శాంతరసంబుగైకొని మేమడిగిన ప్రశ్నకును త్తరంబొసంగవలయును. మహాత్మ! (అనిన సంతోషి తస్వాంతుండై)

గర్గ—అట్లాగే చెప్పచున్నాను. రాజేంద్ర!

గీ. సరవి రేవటిమాఘమాసంబునందు
శుక్లపక్షంబునసుమడిసొంపుమీర
దశిమిగురువారమునమహాదాత్తగతిని
నెక్కలగ్నంబుసఫలమైయున్నదయ్య. 3

ఈలగ్నంబున మీరాకార్యం బొనర్చితిరేని చక్కగా నిర్వర్తిల్లు. రాజచంద్ర! (అనిన సంతోషించి మంత్రిమొగంబుచూచి.)

విం—నర్మసచివా! యీధరాసురశిఖామణికి అనర్ఘ్యవస్త్రభూషణతాంబూలాదికంబు లిప్పించి వీడ్కొల్పుము. అంగవంగ కళింగ కాశ్మీర కురు కరూశ ద్రవిడాంధ్రదేశ ప్రముఖ చప్పన్నదేశాధినాథులకు ఈవార్త శుభలేఖలమూలముగా తెలియపరుచుము. లగ్నకాలంబు వరకేవిధమయిన లోపములు లేకుండునట్లు అన్ని కార్యంబులొనర్పుము. మన నగరంబుశృంగారింపఁ బనివాండ్రని యమించుము.

మం—భవదాజ్ఞాను సారంబుగా భూసురోత్తమున కన్నివిధంబుల సంతోషపెట్టి పంపినాడ. తక్కినవన్నియు క్రమక్రమంబుగా సిద్ధపరుచుచున్నవాడ.

(అందరునిష్క్రమింతురు.)

రంగము—భర్మహర్మ్యము.

(మిత్రవింద ససఖియై ప్రవేశించి, చిత్తజాయత్తచిత్తయై తత్తరంబున.)

14 జంఝూటి-రూపకము.

మరచిపోతివో కృష్ణా-కృష్ణా కృష్ణా నన్ను
కలువరదీర నీదు సోయగంబు గాంచనైతి హా।
నెరకౌగిటనుండితీవను-విరసునవే మోసపోతి మ॥
ఇచ్చకములు చేసినా-కేమోయేమో యేమో చెప్పి।
పిచ్చిదానిచేసికూరి-మెచ్చజేసితా హా।
మచ్చిక చేవయ్యోదముడి-విచ్చిననలమచ్చటలు మ॥
పెదవికేనియులాని-యానియూని డుచ్చి।
సదమలాంగినిన్ను బాయ-జాలనంటివా హా మ॥
ముదమొదవగ కందర్పుని-కదనంబున నేలవదడి।
ధరణిచోల్లేరుపాల-పాలపాలశౌరి।
కరుణతో దేవపల్లిలక్ష్మి-నరసింహరాయావన।
శరణంటిని సరసిజముల-నిరసించెడి చరణములకు మ॥

(అను వాక్యంబులు విని వెరగంది కీరవాణి మదనమాలలు లేచి)

చెలి—తల్లీ! రాజపుత్రీ! నీకొదవిన మదనజ్వరంబును చంద్రశైత్యంబును పోగొట్టి యుంటిమే. తిరిగి కృష్ణపై తీవ్రోద్రేకంబు గలిగినట్లు తోచుచున్నయది. ఏమి కారణంబు చెప్పు మొప్పులకుప్పా (అనిన తలయెత్తి చూచి మహాదైన్యంబున)

మి—ఉ. ఏమని చెప్పుదాన తరళేక్షణలార! మదీయమానసం
బామురవైరియందు ప్రియమారగడించె దెనుమేను మాత్రమి
చ్చోమిము బాయకున్నయది-సొంపుగ నేను గమించు వెల్లవం
డై మనియున్నదంచు నెద-లందుల నమ్మకుడమ్మ మీరికన్. 4

(ఆత్మగతంబున)

15 నాటకురంజిరాగం-రూపకం

మరచినామరపురాదుగా—పగకానివగలు॥
కరుపుదీర మోవిపాన-కంబుగ్రోలిచవులకలరి।
చెరుకురసంబాకలెక్కయే—చెలియనిపలికినపలుకులు మఱి॥
నడుముక్రిందయెడమచెయ్యి-నాకెమ్ముగనుజొనిపియెత్తి
యొడలెల్లసునొడలిపయిన్వ్రాడ-కౌగిలిగొనుదుడుకులు మఱి॥
కప్పురంపువిడెముపంట-గట్టిగానుబట్టినన్ను
చప్పునమునిపంటనుగొను-మిప్పుడనెడుపలుకులన్ని మఱి॥
లలిదలిర్పతాడేపల్లిలక్ష్మి-నారసింహరాయుఁ
నలరించెడుచొల్లేశ్వర-జలజాక్షునిబలునేర్పులు మఱి॥
(అనికీరవాణిమదనమాలలగనుంగొని)
సీ. రాదుగానాయీండుఁవాడుగాదయవీడి
నాడుగానాయుమేఁచూడవమ్మ
(అనినమదనమాలయంజలిపట్టి)
మ—ఎందుకేచెలివానిఁబొందుకేగదదీని
మందుకేయోచించుఁచుందునమ్మ
మి—పోదుగావిడనాడఁరాదుగాయీకూర్మి
లేదుగాప్రియమునాఁమీదకొమ్మ
(అంతకీరవాణి తేనెలొలుకుపలుకులతో)
కీ—కందకేమదిభీతిఁజెందకేమరుబారి
గుందకేధైర్యంబుఁజెందవమ్మ
మి—గీ. మానవచ్చునెయనుభవమైనకతల
మ—మానుటొకయబ్రమేవెఱ్ఱిదానవమ్మ
మి—పోయివచ్చెడివారెవ్వఁరేయచటికి
కీ—పంపవేపోయివచ్చెదఁబైడిబొమ్మ. 5

చికురనిందితషట్పదబృంద ! మిత్రవింద ! నీడెందంబున నెందుకు సందియంబు. నీయిష్టంబుకష్టంబనకస్పష్టంబుగా చేసెద. చెప్పదగి

నమాటలు చెప్పిన నిప్పుడే పోయెద. నామాట ముమ్మాటికి నమ్ముం

(అనిన చిఱునవ్వునవ్వుచు కీరవాణింజూచి)

మి—సీ. కనుమూసిననుచూచి♦ననుసేదుసోయగం
బున్నతగతితోఁచుచున్నదనుమి
తనుమానిననుకాని♦పనిబూనిపెరవాని
కోమలికలనైన♦గోరదనుమి
తనయన్నలనుమన్న♦ననుగోరితనపూన్కి
తెలియగానూచన♦తెలిపెననుమి
సిరిపట్టువరవెట్టి♦నరుచిరబౌణము
శ్వేయుగాచెలినిల్పి♦దాయెసనుమి

గీ. యలుకలొలుకగకలకల♦బలుకుచున్న
చిలుకపలుకులకలకల♦కులికెననుమి
ఝుమ్మఝుమ్మనుభసలగా♦నమ్ముపకును
కొమ్మకిమ్ముగతలద్రిమ్మ♦గ్రమ్మెననుమి. 6

ఉ. రమ్మనుపువ్వుబోణికిక♦రమ్మనురాగముకల్గెనీపయి
నెమ్మనురుక్మిణీసతివ♦లెన్మనుపందగుమాశుభాంగినీ
సొమ్మనుకొమ్మగాదొకరి♦సొమ్మనువేడుకతోడనీవుగై
కొమ్మనుపైడిబొమ్మయను♦కొమ్మనుకృష్ణునితోడనెచ్చెలీ. 7

చ. దరమనుమాశుభాంగికి♦ముదంబలరించెడికందరంబునుం
దరమనుమాపసిండికిని♦తళ్కులొసంగెడిమేనికేవికా
వరమనుమాచనుంగవకు♦వారిజలోచనరేపెనాస్వయం
వరమనుమాజనార్దనుని♦వాసిగతోడ్కొనివేగరాసుమా. 8

(అనిచెప్పి నిరుపమాలంకార సర్వావయవయై తనశృంగారం
బంత యొక్క దర్పణపటంబునం దాకర్షింపచేయించి యాదికీరవాణి
కరంబునకు కరంబుగానొంసంగి ప్రకాశముగా)

16 శ్రీరాగం-రూపకం.

పోయిరావె బాలికామణీ। వారికడకు నేడు॥ పో॥
నాయుదంతమంత జెల్పి తోయజాక్షునీయెడకును బోయకతే॥ పో॥
నిన్ను నమ్మియున్న దానను। నామనమునందునీ॥ ని॥
కన్నెపాయ మెల్లసొగసుగా మొనర్చి। వెన్నునకేజన్నెకడితి॥ పో॥
ఒంటిగాంచి మాటలాడవే। గోపాలుతోడ నెంటి॥
కొంటెలైనయచటివాలుగంటులకట। వింటేబల్తొంటాయిక॥ పో॥
ధారుణిచోల్లేరుపురమున। విహరించుచుండి॥
నారితాడేపల్లి లక్ష్మీనారసింహారాయావనుడేలును నిను॥ పో॥

కేశాశితజితనీరద శ్రేణి! కీరవాణి! నాసంగతినీ వెఱింగిన జేకదా! మొట్టమొదట పటంబుముందటబెట్టి కనిపెట్టి మాటలాడుము. స్వయంవరంబునకుదప్పక రమ్మనుము. రానట్టయితే నీరాచపట్టి సిరిపట్టి బెట్టేయునలరంప కట్టియలుగుట్టుచెడగొట్టు. మట్టుమీఱినవగలసెగల న్వ్రాగలి నగుబాటుజెందునని ముకుందునితో చెప్పి యొప్పించుకొనిరమ్ము. వచ్చుచో యావట ఫలాధరుని పటంబు దెమ్ము. శుభమ్మునబొమ్ము (అని రెండుమూడడుగుల కొలంది సాగనంపును.)

(అందరునిష్క్రమింతురు.)

రంగము—ద్వారకాపురంబు శ్రీకృష్ణకోట్టు.

కృ—(కోరమీసంబులు వడవేయుచు) ఆపదుద్ధరోన్నత్య! యుద్ధవామాత్య!

మం—చిత్తము నందితసనక సనందన వందనందన !

17 జంఝూటిరాగం—రూపకం.

కృ—మంత్రిసత్తమా! తెలియంగబల్క। మంత్రి॥
తంత్రములనుసేయుచుభువి దానవులుజెలంగవారి।
మంత్రంబులువినిశితశర మంత్రంబులజూల్చెదవడి॥ మంత్రి॥

మం——నందనందనా చేసెదనుమనవి। నం॥

ఇందిరేశదనుజుడొక్క-డేని-యుద్ధరాస్థలంబు।

నందునగాన్పించరయే-సందునడాగిరొ తెలియదు॥ నం॥

కృ——భటులువచ్చిరే మనమంపినట్టి॥ భటు॥

దిటవుమీరగానునరుడు-నిటలనేత్రుగూర్చితపము।

పటుగతితోనొనరించియు-పాశుపతాస్త్రముగొనెనట॥ మంత్రి॥

మం——నిజముదేవరా మీఅన్నవార్త॥ నిజ॥

విజయుపూన్కి దీరకున్న-విస్ఫురత్కృపాఫలంబు

భుజియించిన కరుణించక-పోనే శంకరుడైనను॥ నం॥

కృష్ణ——శూరులెల్లను సుఖమున్నవారే॥ శూ॥

పౌరులెవ్వరైన దుష్ట-బాధజెంది యుందురుగద

కారుణ్యమనంబుల మన-వారలు వర్తింతురుగద॥ మంత్రి॥

మం——ధరణిచొల్లేరు పురపాలుడగుచు॥ ధర॥

వడుసతాడేపల్లి లక్ష్మీ-నరసింహ రాయాగ్రగణ్యు

సిరులొసగుచు రక్షించెడి-ధరణీజపుని బోలినశ్రీ॥ నంద॥

సీ. పాపిపూతనమున్నె ♦ ప్రాణములవిడిపోయె
మదతృణావర్తుండు ♦ మాయమాయె
శకటాసురుండు భా ♦ స్వద్రీతినిద్రించె
కడుబావుకొంగర ♦ క్కసుడుగాంచె
కంసభూపతితమ ♦ గమునుండిపడిచచ్చె
చాణూరుడాయమ ♦ స్థలముసొచ్చె
యవనుండు మదమున ♦ దవిలినేలకుగూలె
క్షితిజరాసంధుండు ♦ వెతలదూలె.

గీ. దుష్టసంఘముభవదీయ ♦ ముష్టిహతుల
ద్రెళ్ళిపోయినకతమున ♦ దేవమధ్య
రాష్ట్రజనులెల్లహాయిగా ♦ రాత్రిబగలు
సౌఖ్యములదేలుచున్నారు ♦ చక్రధరణ.

నిర్వక్రపరాక్రమ నిర్దళిత దుష్టరాజచక్రుండవై ప్రకాశించుభవద్రక్షణీయంబగుచున్న రాష్ట్రంబెల్లనుల్లసిత సర్వసౌఖ్యలీనంబై యున్నయది. శౌర్యౌదార్యధైర్యగాంభీర్య ధుర్యుండవగు నిన్నింతవాఁడవని స్తోత్రంబుసేయుటకు పాత్రుండనే భక్తపక్షపంకజాక్ష!

(అనిన సంతోషిత స్వాంతుండై కోరమీసంబులు వడపేయుచు)

కృష్ణు—ప్రస్తుతకరణీయంబులగు కార్యంబు లెవ్వియు లేవుగదా.

మం—చిత్తము. విచారించిచూచిన నేమియు కనుపించియుండలేదు.

కృ—చం. కుడితొడచేయి లోచనము కుంతలరీతి చలించుచున్నది
య్యెడనెదలోన వేడుకలు హెచ్చగజొచ్చెను రుక్మిణిన్మదిం
బడరగబెండ్లియాడుతరినైనగలిగ్గనుపించెనాకు నే
ర్పడవివరించుసీమజి♦రంబుగ యోచనచేసిమిత్రుడా.

మ—సంరక్షిత కృష్ణా! శ్రీకృష్ణా! భవదమృత మధురవాక్యంబులీ సేవకునకు కర్ణానందంబులు చేయుచున్నవి. కొద్దికాలంబులో నొకముద్దియ నీముద్దరాలగు నట్టుకను పట్టుచున్నయది. ఇందు కెందును సందియము లేదు. దక్షిణనాయకుండవై ప్రకాశించు నీకెందరుసుందరులైనం గొదువగానే యుందురు. దేవా!

(అని అందరు నిష్క్రమింతురు)

రంగము—కృష్ణుండు కీరవాణి.

(కీరవాణి భయభక్తియుక్తిచే తస్కాయె యొక్క పటంబు వారిముందటన్బెట్టి చేతులుజోడించి)

సీ. జోహారులవేనీకు♦ బాహాబలోద్ధూత
ఘనవిక్రమోద్దీప♦ కంసభావ
దండంబులవేనీకు♦ ధారాధరోపమ
భాసురతరనీల♦ భర్మచేల
జోతలివ్వేనీకు♦ సుందరాపహసిత
కందర్పశతరూప♦ కమ్రచాప

మొఱ్ఱిక్కులివ్వేనీకుఁ మునిజన సంతాన
సన్నుతగుణజాలఁ సత్యశీల
గీ. వందనంబులు సద్భావకవాసుదేవ
శరణులిహితాకకోటీరకశౌర్యసార
నతులానచ్ఛేదలతదుర్కృతవిపక్ష
కోటియభివాదనములయ్యకనికాయ. 11

కృ—శీఘ్రమేవ భవదిష్టార్థసిద్ధిరస్తు. (అని తదీయలావణ్యంబున కతి
కుతుకాయత్త చిత్తుండై నవ్వుమొగంబుతో)

మ. సకియా యెవ్వరిదాన వెందుకొరకై చాతుర్య మొప్పారభ
ర్మకలాపద్యుతితోడవచ్చితివితోరంబై ననీరూపుమ
చ్చికచేగాంచినమోహము న్నెనరునెక్కెలొవ్వప్పగా చెప్పుత
ప్పకనాతోడభయంబుమానియువతీ భాస్వన్మరాళీగతీ. 12

(అనిన శౌరిదయార్ద్రదృష్టికి సంతోషించుచు)

కి—ఆ. పేరుకీరవాణి సారసమృదుపాణి
పటములోననున్న పడతిమిన్న
సేవసేయుదానఁ చెలగినన్నాచాన
మెచ్చుపంపగాను వచ్చినాను. 13

(అనిసమీపించిపటము చేతపట్టుకొనిచూపించుచు ప్రకాశముగా)

సీ. ఇదిక దా కలలోన గదసి తేనెలబావి
యనిచప్పరించినయట్టి పెదవి
ఇదిక దా యెదయెద గడియకౌగిలిగొని
సరవితో మెచ్చిన చన్నుదోయి
ఇదిక దా యెడమచే యిడిమేటిముకురంబు
కరణినున్న దటన్న మరుని యిక్కు
ఇదిక దా తమకంబు గదురగా మేనిపై
వ్రాలిముద్దాడుక పోలపాళి,

గీ. ఇదికదా నీ వెముడివిచ్చి కవదలదీసి
చెలిమిత్రోద్దాలద్రోసినకంచీలకొంగు
ఇదికదా నిందుజాబిల్లి కనదరగొట్టె
నంచుమెచ్చినయీసుందరాంగి మోము. 14

శా. నీమేనత్తకుబుట్టి మోహ మొదలో నీమీద టన్నెట్టియా
న్నోమార్గంగజు బొరగిట్టి విధినా కనుండింపు చేపట్టియో
భామా నీపతిగట్టియుంచుకలుకకన్యాభవంబునన్దట్టిమా
రామారత్నము వట్టియున్నదిసుమా కప్రాణంబు సర్వేశ్వరా. 15

(అనిపలుకుపలుకులకు పరమానందంబుజెంది యాపటంబు క
రంబునబట్టుకొని తదీయస్వరూప యౌవన విలాసంబులకు మెచ్చి
కొనుచు తనలోతాను నవ్వుకొనుచు తలయూచుకొనుచు మీసంబులు
దువ్వుకొనుచు కీరవాణింజూచి)

కృ—ఆ. తల్లిదండ్రులెవరు కతరుణికి పేరెద్ది
యున్నదమ్మ కెందకరతివ యుండు
దేశ మెచటదానికి తేటతెల్లంబుగ
విన్నవింపుమంతకవేద్య కాంత. 16

బాలకాపాలా !

కీ—సీ. అధిపనీమేనత్తయైన రాజాదేవి
సూతురై యొప్పునే కువలయాక్షి
విక్రమశాలులౌ విందానువిందుల
తోబుట్టువయ్యెనే తోయజాస్య
భవదీయమిత్రులై బలుగుపాండవులకు
పినతల్లిబిడ్డయే పీతవస్త్ర
వైభవయుగవంతి వరపట్టణంబున
జన్మించెనే మహాజ్వాలకలాప,
గీ. యదియొరదబృందకాంత్యప హాసితకుంద
సఖిజనానందకచలిత సజలకంద

బుధవిహితచ్ఛందవరయాన॰వుషితమంద
మేదురార్చితకందమా॰మిత్రవింద. 17

(అనుపలుకులు చెవులకు రసాయనంబులై దోప యూవటంబు దిక్కుచూచి చూచి) కుంతలాకార మధుకరశ్రేణి! కీరవాణి!

కృ—మ. తరుణీనాకదివావికిన్దగిన దే॰తప్పేమినన్నొకట
ల్గరమర్థిన్గలలోన దో-చినవను॰ల్గామింపగాబాడియే
సరవిన్దర్పణపృష్ఠభాగమున భా॰స్వద్దీతిగన్పట్టునుం
దరరత్నంబులమూట నందుకొనకాం॰తాయేకిన్నక్కమే. 18

(అని పలుకు కృష్ణుని యభిప్రాయం బెఱింగి)

18 శేహగ్ రాగం-ఆదితాళం.

కీ—వినుముదెల్పెదదానిపల్కు పల్కు-పల్కులను-తేనెలొల్కు॥
కనులతళుకు-బెళుకు చేపలనుచు జెప్పనొప్పునా॥ నీ॥
గనినమారుడనగనెంత మనమునకాశ్చర్యమొంద॥ వి॥
ముక్కుసంపెంగపువ్వునేలు పెద్దయద్దా
ల్చెక్కులడాలు ముక్కు-టక్కులాడికురులుతుమ్మెద
రెక్కలనెకసక్కములాడు-నిక్కుచున్నచనులుపిల్ల
జక్కవలకొక్కరించు॥ విను॥
మోముసోమునితోడబోరు-నారుతీరుచీమలబారు
కామినికంధరముదరము-కోమలియానముసమద
సామజముగానుబల-మేఖియులేదునిజముగ॥ విను॥
పరమదుర్మార్గులచెండి-చొల్లేరనువురమునసుండి
ధరణితాడేపల్లిలక్ష్మీ-నరసింహరాయాగ్రణికి
సిరులనిచ్చిబ్రోచుసీతా-వరునిబోలినట్టిశౌరి॥ విను॥

సీ. చంద్రచేలంబు భా॰స్వద్దీతినీకుం బె
చంద్రఫాలంబుమా॰సతికిలేదె
చక్రంబునీకర॰స్థలిప్రకాశించితే
చక్రంబుమాచెలి॰ స్తనముకాదె

కంజంబున్ననాభి గామోద మొందితే
కంజంబు మాయింతి గళము కాదె
రంభనీకడ జేరి రాగంబు పాడితే
రంభ మాసఖిమోరు రతిచెలగదె
గీ. నీకుగల శబ్దవితతి లోకనిక్కముగను
సగము భాగించుకొని యెహా చానమున్నె
రాకనీ కేలతప్పమా రామకడకు
బాలగోపాల! రాధికా ప్రాణలోల. 19
ఉ. కంటికి నిద్రలేదు నిను గంటిని ముందొక తేయిపూటనా
యింటికి వచ్చి పుష్పశరు డేచగ నానజనింప జేసి బ
ల్మంట మెలంగ బెట్టితివి ధర్మమె రేపట నాస్వయంవరం
బొంటిగ నందరిన్గెలచి యొప్పగ నన్గొనుమన్న దీశ్వరా. 20
ఉ. అందరికంటె నీకు ప్రియురాలైన చెలిన్గద యెట్లటన్న నే
పొందుగ మేనయత్తకును పుత్రికనై నకతంబునన్గదా
సుందరరూపయార్గురుని చూచిన సుందిగ నాడపోకటం
బిందుని భాస్య చెప్పవనజేక్షణ రాగదవయ్య మొక్కెదన్. 21
(అని పలుకుపలుకులకు మొలకనవ్వులొలయ నింతలో కం
తుండంత లతాంతకుంతంబు లేయ నంతకంత కాకాంతపయి నోహం
బెక్క గోరమీసంబులు దువ్వుచు)

కృ—కుంతలనిందితబంభరజాలా! బాలా!

ఉ. వచ్చెదనే స్వయంవరము వారణ జూడగ నాడుదానినే
మెచ్చెద రాజలోకమున మేయగ లిన్నిరసించి దానినే
దెచ్చెద నెవ్వరైనమున దేలి యెదిర్చిరయేని బాణముల్
ల్గ్రుచ్చెద మింట వేలుపులు కోయని యార్వ మదేభగామినీ. 22

ఉ. వద్దనుమింక నెమ్మదిని వారిజనేత్రకు చింత తానునా
పద్దను కష్టముల్జరిగి పాయెను పాయమి కేలనాకుదా

ముద్దనునాకు నీవయినికె మోహాముమించెను కూర్మినీపయి
న్నద్దనుపోయిరమ్మి కనుకకంజదళాభ విశాలలోచనీ. 23

ఈపల్కులు నాపల్కులుగాజెప్పి కప్పురగంధికి కంతుసంతాపంబు కొంతయైన శాంతిబఱుపుము. శుభమ్మున బోయిరమ్ము.

(అనితనపటంబొసంగిన)

(అందరు నిష్క్రమింతురు)

చతుర్థాంకము సంపూర్ణము.



శ్రీచెన్నకేశవసహాయము.

# మిత్రవిందాపరిణయనాటకము.

---

## పంచమాంకము.

(మిత్రవింద, కీరవాణీ, ప్రముఖులు ప్రవేశింతురు)



తల్లి మిత్రవిందా! నమస్కరించుచున్నదాన.

మి—నీకు శుభంబగును గాక. (అని సుందరమగు పటంబు ముందర బెట్టిన పటంబు చక్కగా కనుంగొని ముద్దు పెట్టుకొని)

అక్కా! నీయొక్క భక్తిశ్రద్ధానురాగప్రియంబులకే నెంతని సంతోషింతునే. నావరబోధనంబు దొంగిలించిన దొంగను నేత్రరంగున పట్టితెచ్చితివే. నీవంటిదాసీలుండ నేలికసానుల కొక్కకొఱంతయైనసుందునా! దీనికి ప్రత్యుపకారంబే నేమియొసంగెద. రమ్మా. ఒక్కబిగి కౌగిలిచ్చెద. చారువేణీ కీరవాణీ! (అని మోహావేశముఖియై పటంబుచూపుచు)

మి—సీ. ఈతడే మరుబారికోరుగనినస్నేరి
మోవిపానకమానుకోముద్దులాడు
ఈతడే బిగికౌగిలిమ్మని ననులాగి
చెక్కిలిగొరికినకోచెలిమికాడు
ఈతడే కుచపాళికనెలమితోడవిరాళి
జేదోయిముట్టినకోచిన్నవాడు
ఈతడే తొడలంటికోయింపుతోడననంటి
కంబంబులనిజానికోగన్నవాడు

గీ. ఈతఁడే నన్ను వలపించి హితవు నించి
మనసు గరఁగించి మెఱసిన మాయ కాఁడు
ఈతఁడే నన్ను గని చాల యిచ్చ మెచ్చి
హర్ష మొనరించి పోయిన యందకాఁడు. 1
క. ఎప్పుడు వచ్చెద ననుచును
జెప్పను నీతోడ నాఁడు చెప్పవు సుమ్మా
శ్రీ—క. ఇప్పుడు శుభమే నమ్మా
తప్పక వచ్చును గదమ్మ తథ్యము గొమ్మా. 2
మి—సీ. మెచ్చెనా నను మన సిచ్చెనా నీతోడ
గలసి మాట్లాడగా కంతుమూర్తి
చూచెనా పటము చే వీచెనా నినుఁ గూరు
చుండఁగా దానవఖండనుండు
కప్పెనా కూరిమి చెప్పెనా ముందటి
ముచ్చటలేమైన మునినుతుండు
పట్టెనా వంకంబు కట్టెనా కంకణం
బెలమి వచ్చెద నన్న యిందుముఖుఁడు
గీ. ఒంటరిగ నీకు దారికెనా యింటిలోన
చేడెలెవ్వరు నినుఁ గాచి చూడకుండ
తోచెనా నిక్క మందు నాధుండు వల్కు
పల్కులన్నియు విరిబోణి పద్మపాణి. 3
అక్కా! రేపులే దెల్లుండి యెకదా స్వయంవరంబు ప్రవర్తిల్లు
ట, యికనమ్మకమ్ముగా నొక్క కూర్కు పోయెద.
(అని అందరు పరిక్రమించిరి.)
రంగము-అవంతీపురము—గొప్ప అద్దాలమేడ.
(కృష్ణసాత్యకి దుర్యోధన ప్రభృతిరాజులు ప్రవేశింతురు.)
(అనర్ఘ్యరత్న వస్త్రభూషణ మాల్యానులేపనసంయుక్తఁజేసి
నవీన మోహినీదేవి లీల ప్రకాశించు మిత్రవింద చేతికి నొక్క కాంచనపు

ష్పమాలనిచ్చి మదనమాల కీరవాణులిరువంకలనలంకరించి స్వయం వరంబున కలుదెంచిన రాజమండలి కనతిదూరంబున నిలిపిన చక్రధ రుం డక్కుమారిఁజూచి పుష్పశరప్రేరితుండై కోరమీసంబులు వ డవేయుచు)

కృ-సీ. ఇదిమింటిపైనుండి ♦ యెందుకో తెగిపడ్డ
తొలకరిమెరుపులో ♦ తునకయేమొ
యిదిపూలవిల్తుడిం ♦ పొదవ భార్యకునయి
కలిగిపోసినపైడి ♦ కడ్డియేమొ
యిదినలకూబరుం ♦ డెలమిరంభనుమాని
మరలఁగైకొన్న య ♦ ప్సరసయేమొ
యిదివసంతుఁడుతన ♦ యేలికకంపుగా
బంపినచామంతి ♦ బంతియేమొ
గీ. యిదిజయంతుఁడు ప్రియమెద ♦ పొదలపెంచి
యల్కవ్రేదమువిడిచినరా ♦ చిల్కయేమొ
యిదిఖచరులెల్లముదముల ♦ పొదలిపొదలి
తెరసడల్చినమోహినీ ♦ దేవియేమొ. 4

(ఇవ్విధంబున నవ్వనజలోచనుం డతీత మోహావేశ సంచలిత సర్వశరీరుండై, యాసుందరాంగి నజ్ఞానాంతికంబుగా కన్నులారఁజూచి)

సీ. వలబడ్డజక్కవ ♦ ల్వొలెనున్నపిచాన
పైటలోపలనున్న ♦ పాలయిండ్లు
నిండుచందురులోని ♦ నెరికప్పచందమీ
యెలనాగమోముపై ♦ నెలయుబొట్టు
పెనుతాచుపడగవి ♦ ప్పినరీతిదీపి కీ
జెడమీఁదఁగన్పడు ♦ బెడగుసొమ్ము
మరుఁదువిందులు రెండు ♦ మఱియెక్కిడినగతి
పొలుచునీలేమ క ♦ న్బొమలవంక

గీ. తమ్మిపై వ్రాలు తుమ్మెద దండుపగిది
నింతిమొగమున జేలాడు కుంతలములు
రతికరస్థమహాముకురద్వయంబు
భాతి చెలిచెక్కులందుఁ గన్పడు మెఱుగులు. 5

(ఇట్లు తనమనంబున బెనంగొను మోహాతిరేకంబున బొగడుచున్న నింతలో నాసుందరి మందమందయానంబున సుందరీమణులకై దండలుగొని రాజలోకంబును గ్రేగంటంజూచుచు తదీయ రూప యౌవన విలాసంబులం దృణీకరించుచు కీరవాణి మదనమాలల మొగంబుల్గనుంగొని)

మ—చ. ఎవరెవరీమహీశ్వరు లహీనపరాక్రమశాలులై మహో
త్సవమున నీసభారుచిర సౌధము నిండినవార లిప్పుడో
కువలయనేత్రలార! మదకుంజరసద్గతులార! మిమ్ము నే
సవినయవృత్తిఁ గోరితిని చక్కఁగఁ దెల్పుఁడి దెల్యనాకొగిన్. 6

(అనిన నాసుందరీమణు లానందంబున)

కీ—సీ. ఈనృపశేఖరుం డిభపురీశ్వరుఁడైన
దుర్యోధనుండు నిస్తులయశుండు
ఈరాజకుమారకుం డితనిసోదరుండు దు
శ్శాసనుం డాశ్రితశాసనుండు
ఈసుకుమారకుం డీనృపపుత్రుండు
లక్షణచరితుండు లక్షణుండు
ఈయినతేజుండ హీనవిక్రముఁడైన
కర్ణుండు సద్గుణోదీర్ణకుండు.
గీ. ఇతడు మాళవదేశంబు నేలువాడు
ఈమహీశుడు కోసలభూమివరుడు
ఈధరాపతి కాశీశుఁ డిభబలుండు
ఇతడు సాల్వరసావరుం డిందువదన. 7

కీ—సీ. సద్గుణంబులపేటి శతకోటిమన్మథ
సుందరుండితఁడుకృష్ణుండు బాల
హాలధరుండీహరి యన్నమహాబలుం
డీమేటిబలరాముఁ డిందువదన
యీశూరుఁడారుక్మి ణీశునితమ్ముండు
సాత్యకియనువాఁడు సామజగతి
కంసునిమిత్రుఁడు త్కటవిక్రమాఢ్యుఁడీ
కృతవర్మయనునోపు కీరవాణి
గీ. వీరుకేకయరాజులు విబుధహితులు
వీరుసృంజయభూపతుల్ వీరవరులు
వీరుకర్ణాటకేశులు విజయయుతులు
వీరుమత్స్యేశసావరుల్ సారసాక్షి. ౮

(అనిపేర్వేర జూపించిన కొమ్మనిమ్మళముగాచూచి తనకంటికి దంటయైనవాని నొక్కరునైననగానక క్రొత్తచిత్తజునివలెపొంచుచున్న వెన్నునిచూచుచున్నయెడ కృష్ణుండుపట్టరాని మోహంబున యాడిట్టు రిన్గవయదలచి యాత్మగతంబున)

కృ—ఆహా చక్కెరచవులధిక్కరించగల యీటక్కులాడి కమ్మనివా తెరనొక్కసారియైన జుఱుక్కుననొక్కి యందుసందులేక తొరుతేనె లజాలునుగ్రోలి చప్పరించనియుప్పులుగాకి నాలుకనాలుకా! వహవ్వా! మెఱుంగుటద్దంబులం దురంగలించు యీకురంగలోచని గండస్థలంబులు కొండొకసేపు నిండువేడుకతో ముద్దుపెట్టని గద్దరీడు పెదవులు పెదవులా! అబ్బురంపు జక్కవగిబ్బలనుబ్బరంబును దెబ్బనబడద్రోయునీబిబ్బోకవతి సిబ్బెంపు గబ్బిగుబ్బల దెబ్బలబడి నిబ్బరించనివాని వక్షమ్ము వక్షమ్మా! షహబాస్ తొగలతెగల వగలనగలచేసి బిగి నెగడుచందురుని యందంబు పసందుసేయుని యీమందయాన సుందరాననంబు చెన్నుమీర కన్నులార జూడలేని కోడెకాని లోచనంబులు లోచనంబులా! బళా! రంగారు బంగారుతీగెల సింగార

మెంతని బడాయించ బడాయిగల యీనాతి చేతులు చేతో హ్లాదంబుతో చేతితోఁబట్టుకొని గట్టిగామాటలాడని మేటి కరంబులు కరంబులా! అరే! బెళుకువాలుగల తళుకుల కులుకుగలుగ జెలగునీ కోపనచాపలంబులకు చూపులను నోపికతో నిలువలేనివాని ధైర్యంబు ధైర్యంబా! అబ్బబ్బా! గోచరంబైన మోచాస్తంభంబుల నీచంబులు చేయు నీకర్ణాంతాయత లోచని యూరువులారని మోహంబున తేరి చూచి మచ్చికచే మెచ్చనివాని మానసంబు మానసంబా! నేనెవ్విధంబున నైన నీజవ్వనికొరకై యీవసుధావరులతో తప్పులాడియైన దక్కించుకొననైతినేని సేనుకృష్ణుండనా! పోషితజిష్ణుండనా! (అనవసరంబున నమ్మగువ నగుమొగంబుతో రెండుమూడడుగులిడినచో దుశ్శాసన పుత్రుండగు లక్ష్మణుండు చూచి మదనపీడితుండై యాత్మగతంబున.)

ల—ఉ. ఇచ్చెదనాకటంచుమును♦నింపుదలిర్పగవిందరాజవా
ఱచ్చెనిదేమిహేతువకొ♦కొమ్మకునేడుస్వయంవరమ్ముతా
నిచ్చదలిర్పనేర్పరిచె♦నీవిధమెల్లనుచిత్రమయ్యెహా!
యిచ్చపలాశినన్నువిడి♦యెచ్చటికోజనబూనెచూడగన్. 9

సీ. ఈనారివాతెఱ♦పానకంబౌనని
నాల్కగాదదిమోవి♦పల్కగాని
యీచానచెక్కులు♦యాచించినొక్కని
పండ్లుకావవిరాతి♦గుండ్లుగాని
యీచెల్వపయ్యెద♦లోచెయ్యిబెట్టని
కరముగాదదిదుఃఖ♦కరముగాని
యీసోమముఖిమేని♦వాసనల్గాంచని
ముక్కుగాదదికొండ♦నక్కుగాని

గీ. యొలమితోదీనిసోయగ♦మెన్ననట్టి
నోరుగాదదియొకపట్లు♦కారుగాని

కోడెతనమునదీనితోఁ గూడనట్టి
చెలువుగాదది యొకకొండఁ జెఱువగాని.

(అని తనమనంబున) నేను నూరక చూచుచున్న నీజోటిదాటి సూటిగా యేసీటుగాని చెట్టబట్టునోగాన దీనిపోనీకపట్టెద. (అని కొంతసేపూరకుండి) ఇందరిలో నీసుందరాంగి న్బట్టిననేమిహాని బూనునో! పట్టిననాపట్టులో నీదిట్టరినిలుచునో నిలువదో! నిలవక పెనుగులాడినచో చేడెకుచాలదని కోడెకాండ్రేమైన నవ్వుదురేమో అని యుల్లంబెల్ల తల్లడిల్ల కొంతవడికి ధైర్యంబు దెచ్చుకొని) కానిమ్ము చూచుకొంద మిక్కడ మావాండ్రందరుండ నడ్డగించువారెవ్వరని దిగ్గున లేచి కరవాలంబు ఝుళిపించుచు త్రోవకడ్డంబై.

19 పురాణభూషణం—ఆదితాళం

పోకుపోకిక్కడనిల్వవె బాలా। దాటి।
పోకడనీకెంతో మేలా॥ పో॥
నీకొరకెయూసించివచ్చియుంటి। నీదు।
సోకెల్లకన్నులఁగనుగొంటి। నీకు।
నాకనుదీటుగానున్నదంటి। యింత।
లోకిబాకుబీకినన్ను ఁడీకొనెమారుఁడు। దయ।
రాకయున్న-పువుకోలాల।
కాకలపాల్గాకయుందునె॥ పో॥

మి—ముట్టకుముట్టకు దూరముండు। నేను।
గట్టిగనుజూచినను మేనుమండు। నన్ను।
కట్టడిపను లెందుకు దాటిపోర। యింత।
మిట్టిపాటునీకునాయమౌర। రాచ।
పట్టివైతె యీపనినీకుమేర। యిక।
బెట్టుమట్టుబెట్టుకోక తట్టునతొలగుము। తొలగ।
నట్టయితే నాచిన్నన్న చేబట్టితె నీపెట్టవుదువు॥

ఉ—సుందరి బెదరించితె భయమాగను|పనిలే,
కుందునె యూరక వచ్చినాను|జగ|
త్సుందరి యిందుముఖి కౌగిలియ్యకున్న|మోద|
మొందూనె డెందము చెల్వాలమిన్న|నీకు|
సందనము సేతు సేయుమన్న|భేద|
మొందుకింత మందయాన సుందరుఁడగా నాకొఱ్ఱె|
లెందుకీనవిందను మాన మొందుకెనా చుందుచాన॥ పోకు॥

ఖ—రాజులునవ్విన సిగ్గులేదా|ఛీఛీ|
నీజన్మము నేలపాలుగాదా యెల్ల|రాజు|
రాజితతాజేపలిలక్ష్మీనార|సింహ|
రాయనేలు చొల్లేరుపురవిహార|హరి|
యైజెలగు జానకీశుని గోర|కల్ప|
భూజమగు మనన్ను బ్రోవదె జోకదలిర్ప|శత్రు|
రాజిచూడ నేగోరిన రాజునె నా రాజు జేసి॥ ముట్టు॥

ఓయి భ్రష్టప్రజ్ఞా! ఈస్వయంవర సభారంగంబున కట్టుపదలి నన్ను పట్టవచ్చెద వీరట్టునీకెట్టుపోను. నీవు రాచపట్టి వయినట్టు దోచకయున్న యది దూరముందుము. నీమానప్రాణంబులు దక్కించుకొనుము. (అని రాజలోకంబు వీక్షించి ప్రకాశముగా) ధరాధర తల్లజాలారా! యీయల్లరి మీయెల్లరి యుల్లంబులకు సమ్మతంబే కదా. (అనునంతలో ననువిందుండు మహారోష భీషణాకారంబుతో వచ్చి వరలోని కరవాలంబు కలుక్కున దూసి చెల్లెలిని బిరిందికిన్ద్రోచుకొని వానినెదిరించి భీకరముగా రౌద్రరసముతో.)

శా. ఎట్లోయిప్పటిపల్కుపల్కితి దెయో హేతిన్ నైగన్వ్రేతు నీ
పట్లా మాముకు రాస్యబట్టెదువ హా వ్యాయీ మహారాజుల
న్వ్రట్టన్బెట్టి పుశీర్ష భాగమున గర్వంబెక్కె నాకుజ్జనీ
కట్టల్లా గవుమాస భాస్థలమున న్గాఱున్న సేపేటికిన్.

అ. కన్యక స్వేచ్ఛగా నందఱిజూచి తనకంటికెవ్వఁడిష్టమై తోచునో వానినివరించుటయె స్వయంవరము. దానియర్థం బొక్కింతయైన నెఱుంగని నీవొక్క రాజపుత్రుడవా! ఛీఛీ! నీమొగంబు చూచుట పాతకంబునకు హేతువు. ఇట్టినిన్ను గెంటించుటయె మేలు. నీవంటి తుచ్ఛభూభుజ కుమారులీ సభలోనున్నను బుద్ధిగలిగి వర్తింతురు గాక. లెమ్ము. (అనెడిమాటలు కర్ణంబుల కశనిఘాతంబులై కోప దుశ్శాసనుం డాగ్రహోద్వృత్తచిత్తుండై గద్దియపైనుండి దిగ్గునలేచి కరవాలంబు ఝళిపించుచు)

దు-శా. ఔరా దుర్మతి మత్కుమారకుని సాహంకారతన్దూఱెదా
నీరాజత్వము మాపయిన్నెఱపెదే నిర్భాగ్య నీవెంతనీ
శౌర్యంబెంత బలంబదెంత కుమతీ బిట్టల్కపుట్టించితిం
కేరితిన్పృథుకంగజూచెదవు నీకీవేళతోమూడెనే. 12

మ. సకలోర్వీతలనాథమస్తకలసజ్జాంబూనదంచత్కిరీ
టకనద్రత్నమణిప్రభాపటలిచేకడంబైనపాదంబులీ
య్యకలంకాత్ముని పెద్దతండ్రికిక దాకయ్యాయోగ్యతల్దూరచే
సికటా! పిల్లనిధిక్కరించెదవె ఛీఛీ పాపయజ్ఞానసా. 13

ఓరీ! మత్తదిత్త! చతురుదధివలయితభూచక్రస్థిత రాజాధిరాజమకుటమణి ప్రభావిరాజమాన చరణద్వయుండగు దుర్యోధన చక్రవర్తి సోదరపుత్రుండనై వెలంగుచు రంగత్ప్రతాపుండగు నీలక్ష్మణ కుమారుండీయంబుజాక్షిని నడ్డగించుటయొక్క లెక్కా! యికమాట ధిక్కరించి మాటాడితివేని నీచెక్కుముక్కు కరుక్కున గోసివేసెద. హీనశౌర్యా (అని మీఁదికురుకును, అంతలో కృష్ణప్రేరితుండై కృతవర్మ పుస్తుమీసంబులు నిస్తుగా దువ్వుచు పలుకయు వాలుంగొని గద్దియపైనుంచి గబక్కునదూకి దుశ్శాసనునదిసి)

కృత-శా. ఓయీ కౌరవరాజసోదరమదీయోద్యోగ మీక్షించి తే
స్ఫాయచ్ఛౌర్యముగల్గెనేని యిదెనాకైపైరమ్ము కాసేవుచే

చేయఁజూచెద నీతనిన్ద్రౌపదగాఁచిత్రంబె నీపుత్రకుం
డీయోషామణిఁ బట్టనాయమగునే యీభూమిభృత్సత్సభన్. 14

బాగుబాగు స్వయంవరసమయ సభామధ్యంబున న్యాయ విచక్షణం బిసుమంతయైనలేక హరిమధ్యం బట్టిన నీపట్టికి తండ్రిననిచెప్పుకొని యుప్పరంబగల నార్చుచున్న నీగొప్పతనంబునకు నేను సిగ్గుపడుచున్నవాఁడ నిఁక యూరక కూరుచుండుము. శ్రీదేవినాతో వృథావాదంబులేక తారసిల్లుము. (అని నెయ్యిపోసిన భగ్గుభగ్గున మండిపడు అగ్గికి తగ్గిన కోపంబుచే కరవాలంబు ఝుళిపించుచు దుశ్శాసనుండు సమరోన్ముఖుండై మహారౌద్రరసంబు చిందులుగాఁ)

దు—మ. ప్రతివర్షంబున మాకు కప్పములు శుంభద్భక్తి నర్పించు వీ
డతిగర్వంబున మాటలాడవిని యీవీపట్టిపాలార్తునే
కుతలంబందొకఁడైననాకు నెదురై కోల్పోక ప్రాణంబులు
ద్ధతిజీవించెనె రమ్ము రమ్మిక నీదర్పంబొగిం జూచెదన్. 15

ఓరీ! శుంఠప్రతాప! నీకంఠంబు మత్కరవాలధారచే తీరుత్తికుగా తరిగి ఘోరంబగు నీకబంధంబటు నిటు కావుకావుమని వాపోవు కాకగృధ్రంబు లనేకవిధంబుల గొనియాడ విందుపెట్టెద. ఎట్టకే నిఁకిఁ బోక డిట్టవై రమ్ము. క్రొవ్వియెవ్వరైన వెరుంగక చివ్వకున్నారసి ల్లైదవ! వీండ్లందఱుంజూడ నీకండ్లకావరంబు కొంచెములో దించెద. భోజకులపాంస! (అనునంతకు దుర్దాంత కల్పాంత కాకారుండై మేనువెంచి పండ్లుపటపట కొఱుకుచు దుశ్శాసనున్గని యనేకవిధంబులకరవాసి విక్షేపణంబు సేయుచు)

ఉ. మెత్కృణమొక్క వేళఁ బిసమానిసి నల్పిన రీతి నిన్ను నే
నుత్కటకీర్తిబట్టినగళంబు ప్రుప్పగనల్చెద నెవ్వరడ్డమై
మత్కరవాలధారకు సమానగతిన్గరమిచ్చువారు ఛీ
సత్కులసూతివై యిటుపొసంగని కూతలు కూయుజెల్లునే. 16

రాజరాజసోదరుండవయి రాజలోకంబు ఛీయన చేయరాని పనులు చేయుచు కూయరానికూతలు కూయుచు కులపాంసుండవయి

పుట్టితివేడిసీ గట్టితనంబు చూపించుము అని మీదికిలంఘించి శిరోజం-
బులు పట్టబోవునెడ కర్ణుండడ్డమై కరవాలంబెత్తి సాముసేయుచు)

క—చ॰ నిలునిలు మోరినిన్ను చన•నిత్తునె మాయయువరాజుపై కిదో
ర్బలముననన్ను దాకిమద•పారవిజృంభణశక్తి గోర్చిన
న్నలుగు భవత్ప్రతాపము కు•గర్వమునంతటిదాక నిన్ను నే
గెలుతునె శూరుడంచునిటు•బెట్టుముని మ్ముఖమింక దుర్మతీ. 17

(అని గర్వంబులాడుచు దుశ్శాసనలక్ష్మణ సహితుండై కృత
వర్మ న్నట్టి కట్టప్రయత్నించు రాధాపుత్రు దుష్ప్రయత్నంబు గనుం
గొని సాత్యకి గదాదండంబు కేలన్గొని గద్దియపైనుండి దిగ్గనురికి హే
తివ్రాతంబుతో గల వీతిహోత్రునకు సాటియైన కర్ణునకడ్డంబై)

సా—మ॰ చెడుగా నీమొగమిట్లు ద్రిప్పిగను దా•సీపుత్ర యో కర్ణ! యి
య్యెడ నేనున్న దెఱుంగవ్రాకములక•య్యేన్వోలు పెన్గ్రుడ్డిబ
ల్వాడిమ ద్బాహువునందు గ్రైడిగద•న్వీరుండనై తేనిని
ప్పుడాగిన్దాపలచేత బట్టిజనము•ల్వాలొప్పందగా ద్రిప్పవే. 18

అరేసూతసూతి! దుర్జనవ్రాత! ఘాతుకుండై జెలంగురంగత్త
తంగ పుంగవతురంగునకు సోదరుండనై యవక్రపరాక్రమసంతోషిత
శత్రుండై విజయుండనిపేరుజెందిన పాండవమధ్యమునకు ప్రియశిష్యుం
డనై యున్న నన్నుదాకినీశక్తి ప్రకాశింపజేయుము. నేనుండిభోజపతి
న్వారింతునే! రమ్ము. లేనిచో యుద్ధస్థానంబునందు నిమ్మళమ్ముగా
కూర్చుండుము. ఖండిత ప్రతాప! (అనుమాటలు చెవులకు ముల్లు
కులై దోపసాత్యకిముఖుడై)

క—కం॰ గొల్లడపాలును పెరుగును
చల్లమ్ముక బ్రతుకకింత•సాహసమేలా
బల్లిదులగు రాజన్యుల
నల్లంబగలించి బ్రతికి•యుండువె చెనటీ. 19

(అనుమాట లశనిఘాతంబులై కర్ణరంధ్రంబులన్నడిన సాత్యకి
గదసారించుచు)

20 కమాచి—ఆదితాళము.

సాత్యకి—రారపోరుదమిప్పుడు పాపిష్ఠకర్మతి॥ రారపోరు॥
కౌరవేంద్రుడేరికోరి నినువరశూరుడనుచు
గౌరవింపబ్రతికెదు॥ రార॥

క—పోరునాకొక్క వెండ్లిగా-వీరవరులుడాసిన॥ పోరు॥
వారివీరివలెనన్ను జూచితో-కౌరసిల్లునీదర్పముగనియెద॥ పో॥

సా—ఎంతరనీదుబలము-వివరించిచూడ॥ నెంత॥
వింతగనాగదవ్రేటుననీశిర-మింతింతలుగానిప్పుడుచేసెద॥ రా॥

క—ఆడదియైనగానదు-నీమాటలకెదభయ॥ మాండ॥
వాడిగలుగుకరవాలమెత్తితిని-చూడుమిదిగో
నడిమాడునవ్రేసెద పోర॥

సా—గద్దరిమాటలేలర-చూచికొనుమునీయుశి గద్దరి॥
గ్రద్దననీపిడిగ్రుద్దునగుద్దినదద్దరిల్లుచునుధరపైగూలవె రార॥

క— ఇలనుచోళ్లేరుపురిని-వెలసినసౌధంబున యిలను॥
చెలగుచుతాడేపలిలక్ష్మీనరసింహరాయ
వరదుడైనవెరతునె పోరు॥

(అనియిట్లిద్దరన్యోన్యజయకాంక్షులన్యోరాడుటకై నిశితకాక్షే యవిక్షేవణరిబులు సేయుచుందురు)

(వ్యాసమహాఋషి ప్రవేశము)

వ్యా—ఓహోహో! యాదవకౌరవవీరులారా! యికమీమీ తెగువలు చాలించుడు. నామాటలువిని శాంతింపుడు (అనువాక్యంబు లందరి కర్ణరంధ్రంబులన్పడి తమతమకైదువులువదలి యమ్మహానుభావునకు మ్రొక్కుదురు (అంతవ్యాసుండుకృష్ణునిన్గని) త్రిజగద్రక్షా! దుష్టజనశిక్షా! పుండరీకాక్షా! కృష్ణా! పోషితకృష్ణా! నీవుండియేనా వీరినీపనుల చేయించుట? భవన్మాయాంధకారకూపంబున నబడివెడలు మార్గంబు శంకరపంకజాసనుల కుందరంబె మహానుభావా! రక్షింపుము రక్షింపుము.

(అనిరాజలోకంబు నిరీక్షించి)

ఉ. ఏతపనీయచేలుఁడుమహేశ్వరసన్నుతుఁడేయదూత్తముం
డేతరణిప్రభామకుటుఁడేనవనీరదచారువిగ్రహుం
డేతులశీవిభూషణుఁడేసుమసాయకకోటిసుందరుం
డాతఁడెశేషుఁడుండువరుఁడై తగునీముకురాస్యకిప్పుడున్.

కానమీరందరానందనందనున కీసుందరిసుందరియై పెంపొందుటకు డెందంబుల నానందింపుఁడు ఇదిబృందారక సందోహంబునకును శంకరవాణీవశంకరులకును హితవై యున్న దిందు కెందును సందియంబు లేదు. (అనునెడమిత్రవింద వధూటికామణి డాసి వ్యాసునకు మ్రొక్కును, ఆసుందరి యందంబుచూచి పారాశరపుత్రుండు నవ్వుకొనుచు)

వ్యా-ఉ. జవ్వనినీదుపాయమునకుఁజక్కదనంబునకునీదురీవికిన్
నవ్వుమొగంబునన్వృషిసనాగరికంబునకుమెచ్చినాఁడనీ
కెవ్వనియందుఁగోర్కెజనియించెనోనిర్భయమొప్పనేఁగినీ
వవ్వరశౌర్యుకంఠమునఁహాయిగనేయుముపుష్పమాలికన్. 21

(అనిన సంతోషిత స్వాంతయైచేతులుజోడించి)

మి-సీ. ఎవ్వాఁడమఱ్రొత్తఁబువ్వులుకాదునా
గొల్లపిల్లలవయిఁపెల్లగొనియె
నెవ్వాఁడువరశౌర్యుఁమెనయుగానామేన
మామకుపట్టియైమలయుచుండె
నెవ్వాఁడుసోయగంబింపారజనుదెంచి
కలలోననన్మోహకలితఁజేసె
నెవ్వాఁడుబలిమిచేనెల్లదుష్టులఁజంపి
దృఢశక్తితోడసత్కీర్తిగాంచె
గీ. నట్టికౌస్తుభమణిహారుఁనవసుధీరు
జిష్ణుసన్నుతునుగుణరోచిష్ణుకృష్ణు

శోరియున్న దినాంమదికిగుణవిధాన
దయాగమంగొనుమికపోయిదండవేతు. 22

(అని నమస్కరించి నిలచియున్న చేడెన్గాంచి)

వ్యా. శీఘ్రమేవ మనోవాంఛాఫలసిద్ధిరస్తు. సుందరీ! యాలస్యం బెందుకు నీయిష్టమ్ముకానిమ్ము. (అనిన చెలులిరుగడలనడవ మందమందయానంబుల నరిగి కరంబున న్వేలుంగు కాంచనమాలిక హరికంఠంబున వేసి తలవంచుకొని నిలచియుండును.)

(అందరు నిష్క్రమింతురు)

రంగము—వివాహమంటపము.

(గర్గమహాముని విందానువిందులు కృష్ణసాత్యకి బలరామ కృతవర్మలు మిత్రవిందా మదనమాల కీరవాణులు విధ్యుక్తప్రకారంబున కల్యాణంబొనర్చి సోదరీమణియైన మిత్రవిందను కృష్ణునకొసంగి విందానువిందులు చేతులుజోడించి)

విం—సీ. నిరుపమవిస్ఫురత్సరసిజాయతనేత్ర
భైష్మీకళత్రశుంభచ్చరిత్ర
పృథుసురభీయుత బృందాటవీలోల
పాలితామరజాల నీలనీల
ఘనరుచిజితమూర్త్యా కౌస్తుభాంచితహార
నవనీతచోర దానవవిదార
సుందరతిలకసంశోభితసులలాట
మానితఖగఘోట మణికిరీట

గీ. రత్నకుండలయుత కర్ణరమ్యవర్ణ
సూరిసందోహమందారశౌరహార
విజయవందిత గోవింద విశ్వతుంద
కేశవాచ్యుత సత్కీర్తి కృష్ణమూర్తి. 23

చ. పొలుపుగ మేనమామకును పుత్రుడ నేనిటు లుండమానిమీ
చెలియలికి స్వయంవరముశేయుటతప్పని యెంచబోకుడా

ఖలుడు సుయోధనుండు మముఁగారియబెట్టు నటంచుయుక్తిపెం
పలరగ జేసినారము సుధాధరమిమ్మె వరించునంచొగిన్. 24

(అని జాంబూనదాంబరాభరణ గజతురగస్యందన భటనటవిటగాయక పరిహాసక దాస దాసీలనరణంబొసంగి సాగనంపిన అందరు నిష్క్రమింతురు)

మంగళహారతి. రాగం. నాదనామక్రియ-ఆదితాళము.

మంగళమిహాశౌరి|లోక|మంగళదాయక మంగళవిగ్రహా|| మంగ||
రంగాపతంగతురంగపోషితఘ-రంగా సద్గుళఫాల|
మద|భృంగాచికురజాలా|బుధ|సంగక్షేమచేలా,
రణరంగరిపువిఫాల| యంగజాంగభంగలోల|| మంగ||
రామానిర్జితభృగురామా|శ్రీకృష్ణబలరామా రాధికాజార|
పరభీమా కంసవిదారా|రవి|ధామాకౌస్తుభహారా|
గోపి|కాముఖపద్మసూర| కామకామశ్యామాకార|| మంగ||
నందగోపాలకనందన సనకాసనందనహృదయతోష|
పరి|మండితభక్తదోష|జన| వందితచారుభూష|
కవి|మందారనరకశోషా, మందమందసుందరభాషా|| మంగ||
నరతాడెవలిలక్ష్మి నరసింహారాయేడ్య నరసఖమందహాస|
చొల్లేరు|పురభవ్యహర్మ్యవాసా|జానకి|వరనిత్యసత్యోల్లాస|
చాంపేయ|వరపుష్పదివ్యనాసా|మురహారశరనిధిత్రాసా|| మంగ||

మంగళహారతి. సురటరాగము-ఆదితాళము.

హారతులివ్వగరారెలక్ష్మి నారాయణహరికి|
సమాశ్రయ|వారణరిపుహరికి||
మహాభయ| కారణాభపతరికి|
శిరోరుహా|వారవినీలవిదారితబంభర|
నారులార సుకుమారులార|శుభ|| హార||
తొగలమగనిజిగి దెగడెడునగు మొగముగలుగు ద్వారసుండి|
తనంతట| నెగడు నెపుడుధండి|

శివాహుల। మిగిలెరిపుల చెండి। మహాత్ముఁడు।
ఖగనాయకతురగ-గమనుఁడురుప।
న్నగఘనశయనుం-డగకరిసఖబలు॥ హరి॥
శరదాంతర్గతచంచలవలెనిరి। యురమునగలవాఁడు।
చెట్టునమకుటిభీషణనాడు। పీతాం।బరముఁదాల్చినాఁడు
చూడుఁడు। తరళేందీవర-దళలోచనములు।
తరుణులారకుం-దరదనలార॥ హరి॥
పాటఁ బుగచొల్లెద్స్వరమునతోడే। పలికసత్కాలమణియై।
మహాబుధ। ఫలదసమగ్రణియై।సదామది।
ఖలనిరసనగుణియై।ముదంబున।జెలఁగుభక్తనరసింహరా-
ట్సదనరిలయుఁడైన హరినీలునకిప్పుడు॥ హరి॥

క. సాధారణవత్సరమున
పాదుగనాశ్వయుజశుద్ధసవరవిదియను సం
మోదమున మిత్రవింద సు
ధాధరినాటకము పూర్తిసేయుహరికృపచే. 25

ఫలశ్రుతి.

క. ఈనాటక మెవరైనను
మానుగఁజదివినఁబవిన్నఁగమతిఁవ్రాసినచో
మానితగతి చొల్లెదవు
రినాథుఁడు ప్రోచుచుండుసుకృపరంజిల్లన్. 26

గద్యం.

ఇది శ్రీ మాచెర్ల చెన్నకేశవా క్షీణ కటాక్ష వీక్షణ ప్రవర్ధిత చతుర్విధ
కవితావిచిత్ర కాత్యాయనసూత్ర హరితసగోత్ర సూరపరాజగోత్ర
రోహిణీకళత్ర సీతారామమంత్రిపుత్ర సుకవిమిత్ర వేంకట
రమణ కవికందపత్ర ప్రణీతంబైన మిత్రవిందాపరి
ణయనాటకంబు సర్వంబు పంచమాంకంబు
సంపూర్ణము.

